

# గాంధీకథ

# గాంధీజీ కథ



ప్రచురణ:

ఆంధ్ర ప్రింటింగ్ వర్క్సు

(పబ్లికేషన్సు డిపార్టుమెంట్)

వరంగల్

డిశంబర్ 1954] [ఆరు అణాలు

ఈ పుస్తకం తయారుచేయుటలో

ఈ క్రింది గ్రంథకర్తల ప్రసిద్ధ పుస్తకాలు తోడ్పడినవి —

1. క్రిష్ణాహుతీసింగ్
2. గెర్ట్రూడ్ ముర్రే
3. లూయిూఫిషర్
4. ఆకురాతి చలమయ్య
5. గొర్రెపాటి
6. మహాత్మాజీ
7. టెండూల్కర్

వీరికి - ఆయా పుస్తకాల ప్రకాశకులకు

మా కృతజ్ఞతలు —

●

రచన:

"జగదీశ్వర్"

బొమ్మలు:

దేవీ & కేశవ్

●

మొదటి ముద్రణ అక్టోబర్, 1954.

రెండవ ముద్రణ డిశంబర్, 1954.



భారత స్వాతంత్ర్యోద్యమంలో

ప్రాణాలను బలిపెట్టిన

వేలాది అజ్ఞాత సోదరులకు

అంకితము

# ఒక మాట

## పెద్దలకు—

ఇలాంటి పుస్తకాలు ముమ్ముందు అనేకం ప్రచురించబోతున్నాం. వాటి నన్నిటినీ మీ పిల్లలచేత విధిగా చదివించవలెనని మనవి. ముమ్ముందు దేశ పౌరులుగా రూపొందేది నేటి మన పిల్లలే కనక కావలసిన లోకజ్ఞానం అదీ వారికి సమకూరేటట్టు చూడడం మన ముఖ్య బాధ్యత అని తమకు తెలిసిన విషయమే. ఆ బాధ్యతా నిర్వహణకే ఈ ప్రయత్నం. అందుకే తమ సహకారానికై ఈ అభ్యర్థన.

## పిల్లలకు—

మీరంతా ఈ పుస్తకాలు ఒకటికి పదిసార్లు చదవాలి. అందువల్ల మహా పురుషుల జీవిత రహస్యాలు తెలుసుకునే వీలు కలుగుతుంది. మన జీవితాల్ని కొంతైనా అందుకు అనుకూలంగా మార్చుకోవచ్చు.



లక్షలాది బీద పరిజానీకం ఇండ్ల ముందు ఆయన దరిద్ర నారాయణుని వలె ఆగారు. ఆయన వారికి అర్ధ మయ్యే భాషలోనే మాటాడారు.

భారతీయు లందరూ తన ఆత్మీయు లేనని ఆయన లాగా ఎవరు భావించారు? కనకనే భారతీయులచే ఆయనకు ఇవ్వబడిన "మహాత్ముడు" అను పేరే ఆయన నిజమైన పేరు. ఇంతకు ముందొకసారి బుద్ధుని విశ్వమానవ కల్యాణం, శాంతి సందేశం విని భారత దేశం ఉన్నతిని పొందినట్లే గాంధీజీ పిలుపుపై భారతం తిరిగి బ్రహ్మాండంగా మేలొకన్నది....

— మహాకవి రవీంద్రనాథ ఠాకూరు.

# తలి దండ్రులు: పుట్టుక

బాబూ, నీకిప్పుడొక గొప్ప మనిషిని గురించిన కథ ఈ పుస్తకంలో చెబుతున్నాను. ఆయనను కొందరు "మహాత్ముడు" అని, కొందరు 'బాపూ' అనీ మరి కొందరు నీలాంటి వారు 'గాంధీ తాత' అని ప్రేమకొద్దీ పిలుస్తారు. అయితే ప్రతి గొప్ప మనిషీ చిన్న తనంలో నీ లాగా నాలాగా పసివాడుగానే ఉంటాడు. నీవూ నేనూ ఆడుకున్నట్టే ఆడు కుంటాడు. కాని మన గాంధీ తాత చిన్న తనంలో ఎవరితోనూ ఆడుకునే వాడు కాదు. కలిసి తిరిగే వాడు కాదు. తన బడేమిటో తనేమిటో—అంతే. ఎవరితోనైనా కలిసి మాటాడాలంటే మన గాంధీజీకి చాలా భయం వేసేది. సరిగా వేళకి బడికి వెళ్లేవాడు. బడి విడవగానే ఇంటికి వెళ్లేవాడు. తన పాఠాలు శ్రద్ధగా చదువుకునే వాడు.

ఇదేమిటీ మీ కథను అన్ని కథల్లాగా అనగా.... అనగా.... అనే మొదలే లేదు. అమాంతంగా ఏదో చెప్పుకు పోవటమేనా అంటున్నావా?

ఓహో అలాగయితే విను.

అనగా అనగా అని చెప్పవలసిన అవసరం లేదు. గాని మన దేశంలో గుజరాతు ప్రాంతంలో రాజకోట అని ఒక చిన్న రాజ్యం (సంస్థానం) ఉన్నది. ఆ సంస్థానానికి మన గాంధీజీ తండ్రిగారు మంత్రిగా ఉండేవారు. ఆయన పేరు కాబాగాంధీ. ఆయన చాలా మంచివాడు. ధైర్యం కలవాడు. తెలివి గలవాడు. కాబట్టి చదువు సంధ్యలు బాగా రాకున్నా ఆ సంస్థానానికి మంత్రి అంతవాడు కాగలిగాడు.

వాళ్ల కులగోత్రాలేమిటి అంటవా ?

కులమూ గోత్రమూ ఇవన్నీ మని కెందుకమ్మా? ఈ కులాలూ గోత్రాలే కదా మన భారతీయు లందర్నీ విడదీసి తమలో తామే కీచులాడుకొనునట్లు చేసినవి? అదీకాక ఈ రోజుల్లో ఎవర్నైనా కులం అడగటం అనవసరమనీ నీకు తెలుసుగదా! కులానికీ గొప్పతనానికీ సంబంధము లేదు కదా! అయినా నీకు తెలుపటానికి గాంధీజీ కులానికి కోమటి అని చెప్తున్నా. ఇక గాంధీ తాత తల్లిగారు. ఈమె చాలా మడీ ఆచారమూ గల మనిషి. రోజూ పూజలూ పునస్కారాలూ వ్రతాలూ నోములూ అంటూ ఆవిడకు సంవత్సరంలో ఓ ఆరు మాసాల పాటు భోజనా

నికే తీరిక చిక్కేది కాదట పాపం. అప్పటి కాలం అలాంటిది మరి! కాని ఆమె ఎంత పట్టుదల, ఓపిక గల మినిషో చూడు. రోజూ సూర్య భగవానుని చూడకుండా ఆమె భోంచేసేది కాదట. వర్షా కాలంలో సూర్యుడు అప్పుడప్పుడు కొన్ని రోజుల పాటు కనబడడు కదా! ఆ రోజుల్లో ఆమె వరుసగా ఉపవాసం చేసే దన్నమాటే..... ఇలాంటి నిష్ఠాపరురాలామె.

అయితే ఈ పుతలీబాయి కాబా గాంధీలకు మన గాంధీజీ పోరుబంధరు అను ఒక పట్టణంలో 2 వ అక్టోబర్ 1869 వ సంవత్సరమున పుట్టాడు. ఈ పట్టణం కథియవాడ్ ప్రాంతానికి చెందినది.

## బడి రోజులు

ముందే చెప్పినట్టు గాంధీజీ చిన్నతనంలో బడిలో ఎవరితోనూ మాటలాడే వాడు కాదు. చాలా సిగ్గుపడే వాడు. బడి తర్వాత ఆటలూ ఆడే వాడు కాదు. చల్లగా ఇంటికి జారుకునే వాడు! తప్పని సరిగా అప్పుడప్పుడు బడి తర్వాత డ్రిల్లు తరగతి ఉండేది. అందు ప్రతి విద్యార్థి డ్రిల్లు చేయవలసి యుండేది. ఒక్కొక్కనాడు సెలవు దినమైనా పిల్లలంతా డ్రిల్లు తరగతికి పోవలసి వచ్చేది. ఒకసారి మన గాంధీజీ కూడా డ్రిల్లుకు వెళ్ళాడు. కాని కాస్తా ఆలస్యంగా.... కనక క్లాసులో

పాల్గొన లేక పోయాడు. డ్రిల్లు తరగతికి వచ్చిన వారి హాజరి పట్టీలో ఈయన పేరు లేదని డ్రిల్లు మాస్టరు మరు నాడు గాంధీజీని పిలిచాడు. "ఎందుకు డ్రిల్లుకు రాలే దబ్బాయ్!" అని ప్రశ్నించాడు. నిజానికి గాంధీజీ డ్రిలు కైతే వెళ్ళాడు కాని తీరా హాజరి పట్టీని బట్టి పోస్తే తేలింది కదా? అందుకని అప్పట్నుంచి గాంధీజీ తన హాజరీ విషయంలో చాలా జాగ్రత్తగా ఉండేవాడు. ఎప్పుడూ ఆలస్యం చేసేవాడు కాదు.

## మాంస భక్షణ

గాంధీజీకి ఒక్కుడు ఒక స్నేహితుడు ఏర్పడ్డాడు. అతడు పొడుగ్గానూ లావుగానూ ఉండేవాడు. అతడు మాం సం తినేవాడు. తాను తినటమే కాదు; మన గాంధీజీనికూడా తినమని బలవంతం చేసే వాడు. "మాంసం తింటే బాగా బలం వస్తుంది; మన దేశీయు లందరూ బలం కల వాళ్ళ యితే మన రాజ్యాన్నేలుతూన్న ఇంగ్లీషు వాళ్లను ఓడించి తరుమ గొట్టవచ్చు" అని చెప్పేవాడు. మాంసం తింటే బాగా ధైర్యం కలుగు తుందనీ, పిరికి తనం పోతుందనీ కూడా చెప్పేవాడు. గాంధీజీ చిన్న తనంలో చీకటి దయ్యాలూ, పాములూ, తేళ్ళ ంటే ఎంతో భయపడే వాడు. కనక తన పిరికి తనాన్ని పోగొట్టు కోవాలని, ందుకని మాంసం తినాలని ఆయనకు తోచింది. పైగా

మాంసం తినటం దేశం కొరకు కూడా ఐనప్పుడు అందులో ఏమీ తప్పు లేదనీ, మన దేశం నుండి ఇంగ్లీషు వాళ్ళను వెళ్ళ గొట్టడం అవసరం కనక మాంసం తప్పక తిన వచ్చనీ తీర్మానించు కున్నాడు. కానీ ఎందుకో లోలోపల భయంగానే ఉన్నది. "శ్రీ వైష్ణవులైన తలి దండ్రులకు ఈ విషయం తెలిస్తే ఎలా? వారు ఎంత బాధపడ తారో, ఏమంటారో" అని. అయినా దేశాన్ని ఇంగ్లీషు వారి నుంచి రక్షించాలిగా మరి? అందుకని మాంసం తిన టమే మంచిదిగా భావించాడు. ఒక క్రొత్త పనిని చేయు నప్పుడు చేయాలా, వద్దా? అని వెనుక ముందు లాడుట సహజమే. ఎలాగైతేనేం ఒక రోజు గాంధీజీ ఆయన స్నేహితుడు ఎవ్వరూ లేని ఒక చోటికి వెళ్ళి మాంసం తిన్నారు. అది మేక మాంసం. తినటైతే తిన్నాడు గాని ఆ రాత్రి గాంధీజీకి కడుపులో మేకపిల్ల అరచి నట్లయిందిట. ఆ దెబ్బతో పాపం ఎంతో ఆరాట పడ్డాడు. కాని ఏమైనా సరే మాంసం తినాలిగా మరి? అందుకని అప్పుటప్పుడు ఇద్దరు మిత్రులూ తింటూనే ఉండేవారు. కానీ తిన్నప్పుడల్లా గాంధీజీ తానేదో పెద్ద తప్పు చేస్తున్నా ననీ, తల్లి దండ్రులను మోసం చేస్తున్నాననీ మనసులో బాధపడే వాడు. ఇలా అయిదారుసార్లు తిన్నాక గాంధీ జీకి మనసు తిరిగి పోయింది. మాంసం తినటం మంచిదైనా చెడు అయినా తల్లి దండ్రులను మోసం చెయ్యటం మాత్రం మంచిది కాదనీ, అది తప్పు పని అనీ, కనక ఇక

నుంచి మాంసం తిన వద్దని శపథం చేశాడు. ఇక ఆయన మరెప్పుడూ మాంసం ముట్టలేదు.

## ఎంగిలి బీడీలు!

గాంధీజీకి మామ ఒక రుండే వారు. ఆయన సిగరేట్లు బీడీలు కాల్చే వారు. అలా కాల్చే టప్పుడు గుప్పు గుప్పున రైలు ఇంజన్ లాగా పొగమబ్బుల్ని తయారు చేసి విడిచే వారు. అది గాంధీజీకి చాలా సరదా అనిపించింది. తనకూ అలాగే కాల్చాలని బుద్ధి పుట్టింది. ఆలోచనలో పడ్డాడు. బీడీలు ఎలా సంపాదించటం? ఎలా వస్తాయి బీడీలు?.... డబ్బులు తన దగ్గిర ఉండవాయె. మరెలా?.... ఈయనతోపాటు ఇంకో



అబ్బాయి కూడా ఉన్నాడు ఈ బీడీల ప్రయత్నంలో. ఇద్దరూ ఆలోచించి మామగారు కాల్చి పారవేసిన బీడీ ముక్కలను పోగు చేసుకొని చాటుగా కాల్చుకొన మొదలు పెట్టారు.

గుప్పు గుప్పుని పొగ బయటికి తీసి సంబరపడి చంక లెగరేసే వారు! ఇలా ఉండగా ఒకనాడు ఎంగిలి బీడీలు తాగకూడదనీ క్రొత్తవే కొనాలనీ వీరిద్దరికీ తోచింది. మరి క్రొత్త వాటికి డబ్బు లెలా? కనక వాళ్ళింట్లో నౌకర్ల జేబుల్లోంచి డబ్బు దొంగిలించటం మొదలు పెట్టారు.... ఇలా కొన్నాళ్లు గడిచాక విసుగొచ్చింది. "ఛా ఏమి బ్రతుకు? రెండు బీడీలకూ పైస లుండవు కదా? ఈ బ్రతుకు బ్రతికి లాభం లేదు కనక చచ్చిపోదాం" అని ఇద్దరూ నిశ్చయించు కున్నారు. మరి ఎలా చావడం? ఎవరో చెప్పారు విషముష్టి గింజలు తింటే చస్తారని. ఇంకేం? ఇద్దరూ ప్రయత్నం చేసి కొన్ని విష ముష్టి గింజలు సంపాదించారు. చచ్చి పోవడానికి ఒక తేదీ కూడా నిర్ణయం చేసుకున్నారు. ఆనాడు గుడికి వెళ్ళి దేవుణ్ణి బాగా పూజించిన తర్వాత, ఒకటి రెండు గింజలు నోట్లో వేసుకున్నారు.... ఇక తినటం చేత కాలేదు. గుండెలు చాల లేదు. బ్రతకాలనిపించింది. అంతటితో ఆ ప్రయత్నం మానుకున్నారు లేకపోతే గాంధీజీ బ్రతికిఉండే వాడేకాదేమో! కాని గండం తప్పింది.

అంతటితో పోగ త్రాగాలనే కోరిక గూడా తెలియకుండానే వారిని విడిచి వెళ్ళి పోయిందంటే ఆశ్చర్యకరంగా లేదూ?

బాబూ! గాంధీజీకి వలెనే నీకు కూడా చెడు స్నేహితులు ఉండి ఉండవచ్చు. అంతటి మహాత్ముడే తన చిన్నతనంలో ఎంగిలి బీడీలు కాల్చటం దగ్గర్నుంచీ దొంగతనాలు చేయటం వరకూ పోయాడు, కనక మనదేం లెఖ్ఖ అని నీవు కూడా ఈ దురభ్యాసాలకు పోతే పోవచ్చు. ఈ విషయంలో గాంధీజీ తన "జీవిత కథ" లో ఇలా వ్రాశారు. "పొగ త్రాగటం అసహ్యకరమూ అనాగరకమూనూ. ప్రజలు ఈ అనవసరమైన దానికి ఇంతగా ఎందుకు లొంగి పోతారో నా కర్థం కావటం లేదు!!....

చేసిన తప్పు తెలుసుకోవటం మంచిదే. కాని తప్పును అసలు చేయకుండా ఉండటం అంతకంటే మంచిది. కాబట్టి పిల్లలు పెద్దల జీవితానుభవాల నుండి గుణపాఠం నేర్చుకోవాలి కదూ?

## గుండెలు చాల లేదు

ఇంకొక చిన్న విషయం. గాంధీగారి అన్నగారు ఒకప్పుడు ఇరవై ఐదు రూపాయల వరకు బయట అప్పు చేశారు. అది తీర్చేందుకై ఆయన ముంజేత ఉన్న బంగారు మురుగులో నుండి గాంధీజీ ఒక తులం తెగ



కొట్టించి అప్పు తీర్చేశారు. కాని ఆ దొంగతనాన్ని ఆయన తన మనసులో దాచి పెట్టుకో లేక పోయాడు. చాలా బాధ పడ్డాడు. ఇదంతా తండ్రి గారికి చెప్పి క్షమించ వేడుకోవాలను కున్నారు. కాని ఎదుట పడి చెప్పుటకు గుండెలు చాలలేదు.... కనక ఒక కాగితం మీద "ఇక ముందెన్నడూ ఇలాంటి తప్పు చెయ్యను ఇప్పుడు చేసినందుకు తగిన శిక్ష విధించమ"నీ వ్రాసి తండ్రిగారికి యిచ్చాడు.... తండ్రిగారు దాన్ని చదువు కాని వల వలా ఏడ్చారు. ఒక వంక దుఃఖం మరొక వంక సంతోషం ఆయనను ముంచి వేసినయ్. కొడుకు అంత పెద్ద తప్పు చేశాడే అని దుఃఖం. తప్పుని తెలుసు కుని పశ్చాత్తాప పడుతున్నాడు. ఇక ముందెన్నడూ ఇలాంటి తప్పు చెయ్యనంటున్నాడు అని సంతోషం.

తండ్రి కాగితాన్ని చించి పారవేశాడు. గాంధీజీకి విధమయిన శిక్ష ఆయన ఇవ్వలేదు. కారణం ఏమిటో తెలుసా? గాంధీజీ చేసిన తప్పును స్పష్టంగా ఒప్పు కో టమే! చేసిన తప్పును ఒప్పుకోవటం—అలాంటి తప్పు మరి చెయ్యక పోవటం చాలా గొప్ప గుణాలు. వీటి కాబా గాంధీ తన కొడుకులో పెంపొందింప జేశారు....

## హరిశ్చంద్రుడు, శ్రవణ కుమారుడు

పైన చెప్పిన విషయాలను బట్టి గాంధీజీకి త దండ్రుల యెడ భయ భక్తులు కలిగి ఉండడము సత్యం చెప్పటమూ అంటే ప్రీతి అని మనం తెలు కున్నాం. అయితే ఈ రెండు గుణాలూ రెండు నా కాలు చూడుట వల్ల గాంధీజీ హృదయంలో పరిధానం నాటుకు పోయినవి. అవి 1. హరిశ్చంద్రుని నాటక 2. శ్రవణ కుమారుని నాటకం. హరిశ్చంద్రుని గురించిన తెలియదేమో. శ్రీరామ చంద్రుని తాతలలో ఒకడీ హ శ్చంద్రుడు. ఈయన తన మాటను నిల్పుకొనుట రాజ్యాన్ని విడిచిపెట్టి, భార్యా పిల్లల్ని అమ్ముకొని, తాన అమ్ముడు పోయి అనేక కష్టాలు పడతాడు. ఈ నాటక చూచిన తర్వాత గాంధీజీకి తను కూడా అలాగే ఎన్ని కష్టాలొచ్చినా అబద్ధాలు చెప్ప కూడదని అనిపించింది అందుకే గాంధీజీ తన దొంగతనాన్ని గురించి చెప్పేశాడ

ఇక పోతే శ్రవణ కుమారుని కథ. బహుశా వు విని ఉండవు. శ్రీరామచంద్రుని తండ్రి దశరథ మహారాజు ఒకమారు అడవికి వేటకై వెళ్ళాడు. ఆయనకు శబ్దాన్ని బట్టి బాణంవేసే "శబ్దభేది" విద్యవచ్చు. అయితే ఆ అడవిలో దగ్గరలోనే శ్రవణుడు అను బ్రాహ్మణ పిల్ల వాడు ఉంటాడు. అతడు గుడ్డివాళ్ళు, పండు ముసలివాళ్లు అయిన తన తల్లిదండ్రులను ఒక కావడిలో మోసుకొని పోతూ ఉంటాడు. మధ్యలో అతని ముసలి తల్లికి దప్పి అవుతుంది. మంచినీళ్లు అడుగుతుంది. చెంబుతీసు కొని శ్రవణుడు దగ్గరలోనే ఉన్న చెరువునకు వెళ్ళి నీటిలో చెంబు ముంచుతాడు. నీళ్ళలో చెంబుమునిగినప్పుడు 'బుడు బుడు' అనే శబ్దం వస్తుందికదూ? ఆశబ్దాన్నివిని దగ్గరలో చెట్లచాటున ఉన్న దశరథుడు అది ఏనుగ నీరుత్రాగుతున్న దనుకొని బాణంతో వేస్తాడు. బాణం తగిలి శ్రవ ణుడు "అమ్మా" అని అరచి పడిపోతాడు. దశరథుడు "అయ్యోపాపం! ఏనుగు అనుకొని మనిషిని చంపానా?" అని పరుగు పరుగున వెళ్తాడు. చనిపోతున్న ఆ బ్రా హ్మణ బాలుడు మా అమ్మనూ నాన్ననూ చూడమనీ, వారికి దాహ మివ్వమనీ, చెప్తూ ప్రాణాలు విడుస్తాడు. తల్లిదం డ్రుల ఎడ అంతటి భక్తిగలవాడు శ్రవణ కుమారుడు. అదేమాదిరిగా గాంధీజీ కూడా తన తల్లిదండ్రుల ఎడ అత్యంత భక్తిగలిగి ఉండేవాడు. హరిశ్చంద్రుని, శ్రవణుని కథలను నీవు జ్ఞాపక ముంచుకుంటావు కదూ,

## వివాహం

గాంధీజీకి పదమూడు సంవత్సరాల వయసులోనే వివాహం జరిగింది. భార్య పేరు కస్తూరిబా. ఈమె చదువు సంధ్యలు నేర్చినది కాకపోయినా లోకజ్ఞానం కలది. భర్త ఉద్దేశాల ననుసరించి నడచుకొనేది. గాంధీజీ తనకుచిన్న తనంలోనే పెండ్లి జరిగినందుకు చాలా విచారాన్ని వెలి బుచ్చారు తన "ఆత్మకథ"లో. అంత చిన్న వయసులో వివాహం చేసుకోవద్దని నీబోటి పిల్లలకె హెచ్చరిక కూడా చేశారు. బాల్యవివాహాలు మంచివికావు. కాబట్టి చిన్న పిల్లలపెండ్లి ఊరేగింపులు చూచి నీవు ఉబలాట పడకూడదు తెలుసా?....

## అన్ని మతాలూ ఒకటే

గాంధీజీకి అన్ని మతాలూ ఒకటే. ఆయన హిందువు కాబట్టి ఇస్లాం మతాన్నో క్రైస్తవమతాన్నో, మరే ఇతర మతాన్నో ద్వేషించే వాడు కాదు. గాంధీజీ చిన్న తనంలో ఆయన తండ్రిగారి వద్దకు ఆయన స్నేహితులు చాలామంది వచ్చేవారు. వారిలో క్రైస్తవులు, ముసల్మానులు, పార్శీలు కూడా ఉండేవారు. జైనమత సన్యాసులు కూడ వీరింటికి అప్పుడప్పుడు వచ్చేవారట.... వీరందరూ మత విషయాలను గురించీ, భగవంతుని గురించీ గాంధీజీ తండ్రిగారితో చర్చిస్తూ ఉండేవారు. ఆ మాటలను గాంధీజీ

తండ్రిగారి ప్రక్కన కూర్చుని శ్రద్ధగా వినేవాడు. అందుచేతనే ఆయనకు అన్ని మతాలూ నచ్చాయి. నేడు గాంధీజీ అనుచరులలో, శిష్యులలో చాలామంది పార్సీవారు, తురకవారు, క్రైస్తవులు కూడా ఉన్నారుకదా!

గాంధీజీకి ఏ మతమైనా ఒకటేనని చెప్పుటకు మరొక నిదర్శనము. ఆయన ప్రతిరోజు ప్రార్థన సమయంలో హిందువులకు పూజనీయ గ్రంథము భగవద్గీత, క్రైస్తవుల మతగ్రంథము బైబిలు, ముసల్మానుల మత గ్రంథము ఖురానుల నుండి శ్లోకాలు అవీ చదివేవారు. ఈ మత సామరస్యం జాతీయైక్యానికి ఎంతైనా ఉపకరించి దేశ స్వాతంత్ర్యానికి దారితీసిందని మన స్వాతంత్రోద్యమ చరిత్ర ప్రకటిస్తున్నది.

## విదేశ యాత్ర

గాంధీజీ బారిష్టర్ పరీక్షకు చదవాలనుకున్నారు. అందుకు ఇంగ్లండు దేశానికి వెళ్ళాలి.... అయితే ఇంగ్లండు దేశంలో అందరూ సారాయి త్రాగుతారనీ, మాంసం తింటారనీ గాంధీజీ తల్లి గారికి ఎవరో చెప్పారు. ఇంకా అక్కడి స్త్రీలు విచ్చలవిడిగా తిరుగుతారని కూడా ఆమెకెవరో చెప్పారు. కనుక యువకుడైన తన కొడుకును సముద్రాల ఆవలికి ఏవిధమైన కట్టుబాటూ లేకుండా

పంపించటానికి ఆమె వెనుకాడ సాగింది. గాంధీల ఇంటికి తరచు ఒక జైనమత సన్యాసి వచ్చేవాడు. ఆయ నంటే గాంధీ కుటుంబానికి చాలా ప్రేమ. ఆయన గాంధీజీతో, తల్లి గారి ముందు "సారాయి త్రాగను, మాంసం తినను, పరాయి స్త్రీలను తల్లులుగా భావిస్తా"ననీ మూడు ప్రమాణాలు చేయించాడు. అప్పుడు కాని పుత్లీ బాయి ఏ అనుమానమూ లేకుండా ఇంగ్లండుకు తన కొడు కుని సాగనంప లేదు! తల్లి ప్రేమ అలాంటిది....

గాంధీజీ ఓడలో ప్రయాణ మయారు. లండన్ చేరాక గాంధీజీ ధనికులైన ఇంగ్లీషు వాళ్ళలాగే తానూ ఉండాలనే కోరిక కొద్దీ చాలా డబ్బు ఖర్చుపెట్టి మంచి మంచి ఉన్ని సూట్లూ అవీ కుట్టించు కున్నారు. కాని గాంధీజీ తన తల్లిగారి ముందు చేసిన శపథాన్ని మాత్రం తుదివరకూ పాటించారు. ఆయన శ్రద్ధగా చదివి బారి ష్టర్ పరీక్ష ప్యాసయి 1891 జూన్ 12 వ తేదీన స్వదేశా నికి ఓడలో.తిరిగి బయలు దేరారు. ఇంటికి చేరుకున్నాక గాంధీజీకి తమ తల్లి చనిపోయిన వార్తను అన్నగారు చెప్పారు. తన ముందు చేసిన ప్రమాణాల నన్నిటినీ పాటించి విజయియై తిరిగి వచ్చిన కొడుకు నామె చూచుకో కుండానే గతించింది. గాంధీజీ చాలా దుఃఖించారు.....

కొన్నాళ్ళకు గాంధీజీ వకీలు పని చేయుటకు

బొంబాయి వెళ్ళారు. ఐదారు నెలలచట ఉండి, రాబడి లేనందు వల్ల తిరిగి రాజకోటకు చేరుకున్నారు. అక్కడే తన ఆఫీసు పెట్టుకుని నెలకు మూడు నాలుగు వందల రూపాయల వరకూ సంపాదించుకుంటూండేవాడు. అందుకు తన "సామర్థ్యంకంటే అన్నగారి పలుకుబడే కారణ" మని ఆయన తమ జీవిత కథలో వ్రాసుకున్నారు.... ఆ రోజుల్లోనే దక్షిణ ఆఫ్రికా దేశంలో వ్యాపారం పెట్టుకున్న దాదా అబ్దుల్లా సేట్ కంపెనీ వారు గాంధీజీని దక్షిణాఫ్రికాకు వెళ్ళి తమ కేసులో పని చెయ్యమని కోరారు. సరే నని 1893 లో గాంధీజీ దక్షిణాఫ్రికాకు వెళ్ళారు.

## తలపాగా "వద్దు" అన్నారు — కాని

దక్షిణాఫ్రికాలో డర్బాన్ అనునది ఒక రేవు పట్టణము. గాంధీజీ ఓడ ఆ రేవుపట్టణం చేరుకునే సరికి అబ్దుల్లాసేట్ స్వయంగా గాంధీజీకి స్వాగతమిచ్చి తీసుకు పోవటానికి వచ్చారు. అబ్దుల్లా సేట్ గాంధీజీ ఉండటానికై చక్కని వసతి ఏర్పాటు చేశారు.

ఆ మరునాడే అబ్దుల్లాసేట్ గాంధీజీని తాము వెళ్ళవలసిన కోర్టు ( న్యాయస్థానము ) కు తీసుకు వెళ్ళారు. గాంధీగారు అప్పుడు తలపై 'తలపాగా' ధరించి ఉన్నారు. గాంధీగారు అందమయిన మనిషి కాదని నీకు ఇదివరకు



చెప్పలేదు కదూ? ఆ దొప్ప చెవులూ, చాటలాంటి వెడల్పయిన ముఖమూ, పెద్ద ముక్కూ తలపై తలపాగా ఇవన్నీ ఆయన కొక వింతరూపు నిచ్చాయి. ఆ విచిత్రి వేషధారి, విదేశ వకీలు అయిన గాంధీజీని చూచి అచటి వకీళ్ళందరూ నవ్వుకున్నారు. కోర్టులో న్యాయాధికారి (జడ్జి) గాంధీజీని తలపాగా తీసి వెయ్యమన్నారు. ఆ కోర్టులో తురకలే తలపాగాలు పెట్టుకునే వీలున్నదిట. హిందువు కనుక గాంధీజీ తలపాగా పెట్టుకునే వీలు లేదన్న మాట! అయితే మన గాంధీజీ, తలపాగా తీసివేయ టము చాల నీచమైన పని అని భావించి కోర్టులో నుంచి బయటకు వెళ్ళిపోయారు. అంతటితో దాన్ని వదలి పెట్టలేదు. ఆ కోర్టు నియమం అన్యాయమైనదని ఆ

దేశంలోని పత్రికలకు వ్యాసాలు వ్రాశారు. దాంతో పత్రికలలో పెద్ద చర్చలు బయలు దేరినవి. కొందరు ఆ నియమం మంచిదేనని వాదించారు. మరి కొందరు అది నిజంగా అన్యాయమే అని వ్రాశారు. చివరకు కోర్టులో తలపాగాలు వద్దనే నియమాన్ని తీసి వేయించంట వరకూ పోయింది. ఆ విధంగా గాంధీజీకి మొట్ట మొదటనే కలిగిన చిన్న అవమానం ఆయిన తీవ్రంగా ఎదుర్కోవటం వలన ఘన విజయంగా పరిణమించింది.

## రంగు ద్వేషం

ఆ కాలంలో దక్షిణాఫ్రికా దేశానికి మన దేశం నుంచి చాలా మంది కూలీనాలీ జనం బ్రతుకు దెరువుకై వెళ్ళారు. అయితే మన వారందరినీ అచ్చటి తెల్లజాతి వారు "నల్లవాళ్లు" అని "రంగువాళ్లు" అనీ అనేవారు. తెల్లవాళ్ళ హోటళ్ళ లోకి నల్ల వాళ్ళను రానిచ్చే వారు కారు. వాళ్ళు ప్రయాణం చేసే రైలు పెట్టెల్లో వీళ్ళను ప్రయాణం చేయనిచ్చే వారు కారు. అంటే మనిషిని మనిషే నీచంగా చూసే వాడన్న మాట. రంగు తేడా ఉండగానే ఏమైంది? వాళ్లూ మనుషులే మనమూ మనుషులమె అనే జ్ఞానం అచటి తెల్ల వాళ్ళకు లేక పోయింది....

ఒకనాడు గాంధీజీ దర్బాన్ నుంచి ప్రిటోరియా పట్టణం వెళ్ళ వలసి వచ్చింది. రైలులో మొదటి తరగతి టికెట్టు కొని ఎక్కారు. మధ్య ఒక స్టేషన్‌లో ఎవడో




ఒక తెల్ల వాడొచ్చాడు. గాంధీజీని ఎగాదిగా జూచి "నీ
ఈ పెట్టెలోంచి దిగాలి" అన్నాడు. "నేను ఫస్టుకా
టికెటు కొన్నాను. ఎందుకు దిగాలి? దిగను." అన్నా
గాంధీజీ. ఆ తెల్లదొర రకీమని రైల్వే అధికారుల
ఫిర్యాదు చేశాడు. అధికార్లు వచ్చి గాంధీజీని ఆ పె
లోంచి వేరే పెట్టెలోకి పొమ్మన్నారు. "ఇది అన్యాయ
నేను దిగను" అన్నారు గాంధీజీ. దాంతో సామా
అదీ అంతా ప్లాటుఫారం మీద పారేసి గాంధీజీని బలః
తంగా దిగి పొయ్యేట్లు చేశారు. గాంధీజీ పాపం!
రాత్రింతా చలిలో గజ గజ వణుకుతూ ప్లాటుఫారం మీ
గడిపారు. దీంతో ఈ జాతి ద్వేషాన్ని పూర్తిగా రు
మాపాలని గాంధీజీ నిశ్చయించారు.

ఆ తర్వాత గాంధీజీ చేసిన కృషిఫలితంగా, ఆయన చేసిన అనేక సత్యాగ్రహాల ఫలితంగా ఆ దేశంలో జాతి ద్వేషం కొంత వరకు తగ్గింది. ఇప్పుడు ఆ దేశంలో నల్ల వాళ్ళూ తెల్లవాళ్ళూ ఒకే హోటలులో ఉండవచ్చు. ఒకే రైలు పెట్టెలో ప్రయాణం చేయవచ్చు. కాని నేటికీ "రంగుజాడ్యం" ఆ దేశంలో ఉండనే ఉంది. దీనికి వ్యతిరేకంగా పోరాటం కూడా గాంధీజీ కొడుకు మణీలాల్ గాంధీ నాయకత్వాన సాగుతూనే ఉంది. గాంధీజీ ఆఫ్రికాలో "సత్యాగ్రహ" విధానాన్ని ప్రారంభించారు.

గాంధీజీ ఆఫ్రికాలో ప్రవేశ పెట్టిన "సత్యాగ్రహ" విధానమే మన దేశంలో కూడా కొనసాగి దేశ స్వాతంత్ర్యాన్ని సాధించిందని నీకు తెలిసే ఉంటుంది.

గాంధీజీ శత్రువును ప్రేమించ మన్నారు. కొట్టే వాణ్ణి తిరిగి కొట్టరాదనీ, శాంతంగా ప్రతిఘటించటం ద్వారా మర్చాన వలెననీ అనే వారు. ఇదే గాంధీజీ "సత్యాగ్రహ విధానం" అనబడుతుంది.

## యుద్ధంలో సేవ

గాంధీజీ దక్షిణాఫ్రికాలో ఉండగానే బోయర్ యుద్ధం మొదలయింది. "బోయర్లు" అను వారిది ఫ్రికాలో ఒక తెగ. వారికి బ్రిటిషు వారికి యుద్ధం జ

ఆ యుద్ధంలో గాంధీజీ బ్రిటిషు వారికి సాయం చేయాలను కున్నారు. ఎందుకో తెలుసా? బ్రిటిషు రాజు మనకు కూడా రాజేకదా అప్పట్లో? అందుకని ప్రతి భారతీయుడూ ప్రభుభక్తి కలిగి ఉండాలని ఆయన తలంపు. కాని ఆయన యుద్ధం చేయటం ద్వారా సహాయం చేయలేదు.... యుద్ధంలో గాయపడే సైనికులకు "సేవ" చేసేందుకై 1100 మంది స్వయం సేవకులను పోగు చేశాడు. గాంధీజీకి ఆయుధాల పైన కాక "హృదయ పరివర్తన" ప్రేమలోనే నమ్మక ముండేది. ఆయన గాయపడిన వేలకొలది సైనికులకు పట్టుదలతో సేవ చేశారు. బోయర్ యుద్ధం ముగిసిన తర్వాత దక్షిణాఫ్రికా గవర్నరు గాంధీజీకి ఒక "మెడల్" బహూకరించాడు. ఆయన చేసిన సేవను బ్రిటిషు ప్రభుత్వం మెచ్చు కున్నది. రోగులకు సేవ చెయ్యటమంటే గాంధీజీకి మొదటినుంచీ ఇష్టమే....మరొక సారి "జులూ తిరుగుబాటు" సమయంలో గాంధీజీ గాయ పడిన జులూ తెగవారికి చికిత్స చేశారు. 'జులూ'లు అనే వారు దక్షిణాఫ్రికాలో ఉండే అటవీ జాతులలో ఒక తెగ వారు. రోగ పీడితులైన వారికి గాంధీజీ సేవచేస్తూ ఉండే వారు. ఇది ఆయన జీవకారుణ్య దృష్టికి నిదర్శనము.

## ఇంటికి

బోయర్ యుద్ధం అయిపోగానే గాంధీజీకి ఇంటికి పోవాలనే కోరిక ఎక్కువైంది. స్వదేశానికి బయల్దేరారు

బయలు దేరునప్పుడు దక్షిణాఫ్రికాలోని భారతీయు లాయన కెంత ఘనమైన వీడ్కోలు ఇచ్చారనుకున్నావు? అందుకు ఆయనకు విలువైన మణి మాణిక్యాలూ, వజ్రాలూ బంగారు వెండి సామానులూ చాలా బహుమానంగా ఇచ్చారు. గాంధీజీ తన ప్రజాసేవ ద్వారా దక్షిణాఫ్రికన్ల హృదయాలను చూరగొన్నారు. దానికి నిదర్శనంగానే పై బహుమతులన్నీ! కాని గాంధీజీ వాటిని తనకోసం ఉంచుకున్నారనుకున్నావా? లేదు. అవి వారికే తిరిగి ఇచ్చివేసి ప్రజల మేలుకొరకై చేసే పనులలో వినియోగించు కొమ్మన్నారు. గాంధీజీ లః త్యాగగుణం మొదట ఆయన పత్ని కస్తూరిబాకు అర్థం నచ్చలేదు. కాని క్రమ క్రమంగా గాంధీజీ ఆచరణ ద్వారా కస్తూరిబా హృదయములోనూ పరివర్తన కల్గించారు. ఇంటగెలిచి రచ్చ గెలువాలన్న మాటను అక్షరాలా నిజం చేసి చూపారు.

గాంధీజీ ఇంటికి వచ్చి మొదటి సారిగా కాంగ్రెసు సమావేశానికి కలకత్తాకు వెళ్ళారు. అక్కడ గోపాల కృష్ణ గోఖలే మొదలగు పెద్దలను కలుసుకుని మాటాడారు. గోపాల కృష్ణ గోఖలే చాలా గొప్పవారు. మన దేశానికి సేవ చెయ్యటమే ఆయన కోరిక. ఆయన గాంధీజీని చాల గౌరవించారు. బొంబాయిలో ఉంటూ వకాలత్ చెయ్యమన్నారు. కాని గాంధీజీ తన జన్మ స్థానమైన రాజకోటలోనే ఆఫీసు పెట్టుకుని పని చెయ్యాలనుకున్నారు. ఇంత

లోకే దక్షిణాఫ్రికా నుంచి అర్జంటుగా రమ్మని పిలుపు వచ్చింది. ఆఫ్రికా ప్రజల పోరాటంలో గాంధీజీ నాయకత్వం తప్పని సరి అయిపోయిన దనుటకు ఇది ఒక నిదర్శనం. ఆ దేశంలోని "నల్లప్రజ"ల పరిస్థితి మరింత చెడిపోయింది. అధికారులు వారిని నానా భాధలు పెట్టసాగారు. గాంధీజీకి చాలా కోపం వచ్చింది. విచారం కూడాను. అయితే ఈమారు "భారత అభిప్రాయం" (Indian opinion) అను ఒక పత్రికను స్థాపించి దాని ద్వారా దక్షిణాఫ్రికా భారతీయుల కష్టాలను ప్రపంచానికి తెలుపా లని ఉద్యమం ప్రారంభించారు. దక్షిణాఫ్రికా ప్రజానీకాన్ని ముందుకు నడిపారు.

## మొదటిసారి జైలుకు

ముందు చెప్పిన జులూ తిరుగుబాటు పోయింది. అందు గాంధీజీ తన అనుచరులతో చాలా సేవ చేశారు. అందుకు బ్రిటిషు ప్రభుత్వం మరొక 'మెడల్'ను బహూకరించింది. ఆ తర్వాత దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఒక కొత్త శాసనం తెచ్చింది. దానివల్ల ఆ దేశంలోని భారతీయులందరూ తమ చేతుల పది వ్రేలి ముద్రలూ ఇవ్వాలి. వివాహం అయిందా లేదా? కులం, గోత్రం, దేశం ఊరూ అన్ని వివరాలూ వ్రాసి ఇవ్వాలి. ఈ మాదిరిగా "రిజిష్ రేషన్" అయిన భారతీయులే ఆ దేశంలో ఉండే వీలుంటుంది. ఇది చాలా అన్యాయం అనిపించటం లేదూ? ఇ

కోటి మన గాంధీజీ ప్రతిసారి బ్రిటిషు ప్రభుత్వానికి సహాయం చేస్తూండడం. వారేమో ప్రతిసారీ సహాయానికి బదులు భారతీయులను అవమానాలపాలు చేస్తూండడం ఏమంత బాగా లేదు కదూ? అవును. అది నిజంగా వారి బలహీనతనే సూచిస్తుంది. అయితే ఈ పరిస్థితిని గాంధీజీ ఆయన అనుచరులు చాలా ధైర్యంగా ఎదుర్కొన్నారు. మేం "రిజిస్ట్రేషన్ చేసుకోము" అని ఖచ్చితంగా శాసనానికి ఎదురు తిరిగారు. అంతే. ఎవ్వరూ రిజిస్ట్రేషన్ చేసుకో లేదు. ఇదే గాంధీజీ చేసిన మొట్ట మొదటి శాసన ప్రతిఘటన; సత్యాగ్రహం. దాంతో ప్రభుత్వం గాంధీజీని మరికొంత మందిని అరెస్టు చేసింది. న్యాయస్థానంలో మూడు నెలల శిక్ష పడ్డది. అదే మొదటి సారిగా గాంధీజీ జైలు రుచి చూడడం. ఆయనకు మొదట భయం వేసిందట. కాని మొత్తం మీద ఆ మూడు నెలలు పూర్తి కాక మునుపే గాంధీజీని విడుదల చేశారు. ప్రభుత్వానికి గాంధీజీకీ రాజీ కుదిరింది. ఆ తర్వాత ప్రభుత్వం పెట్టిన షరతులను గాంధీజీ ఆయన అనుచరులూ ఒప్పుకున్నారు కాని ప్రభుత్వమే తన మాట మీద నిలబడలేదు. అందుచేత తిరిగి సత్యాగ్రహం చేశారు గాంధీగారు. అందరితోపాటు గాంధీజీని కూడా అరెస్టుచేశారు. ఈసారి రెండు నెలల శిక్ష వేశారు.

తర్వాత కొలది రోజులకు గోపాలకృష్ణ గోఖలే

గారు దక్షిణాఫ్రికా వెళ్ళారు; ప్రభుత్వానికీ అచటి భారతీయులకూ రాజీ చేద్దామని. కాని ప్రభుత్వం మొండిగా ప్రవర్తించింది. అందుచేత ఆయన రాయబారం ఫలించలేదు. ఆ తర్వాత దక్షిణాఫ్రికాలో మళ్ళీ సత్యాగ్రహం ప్రారంభమైంది. ఈసారి స్త్రీలూ పిల్లలూ కూడా ఈ ఉద్యమంలో చేరారు. స్త్రీలని మొదట ప్రభుత్వం అరెస్టు చేయలేదు. తర్వాత తర్వాత వారినికూడా జైలులో వేయవలసి వచ్చింది. తిరిగి గాంధీజీకి రెండు నెలల ఖైదు శిక్ష పడ్డది. తర్వాత అందరినీ విడుదల చేశారు,

## గాంధీజీ వేషం : తిరిగి యుద్ధంలో

అయితే ఇంతవరకూ గాంధీజీ దుస్తుల్లో ఎలా ఉండేవారో చెప్పలేదు కదూ? ఆయన యూరోపియన్ దుస్తులు అంటే సూటూ బూటూ హ్యాటూ మొదలగునవే ధరించేవాడు కాని ఈ "సత్యాగ్రహాలు" పెరిగి పోతున్న కొద్దీ ఇక అవి ధరించ కూడదని ఆయన తీర్మానించు కున్నాడు. చాలా సామాన్యమైన భారతీయ దుస్తులనే ధరించాలని నిశ్చయించాడు. ఆహారంలో కూడా కొంత మార్పు చేశారు. పండ్లూ ఫలాలూ పాలూ వెన్న మాత్రమే తీసుకునేవారు.

దక్షిణాఫ్రికా భారతీయులస్థితి కొంత బాగుపడుతు దని అప్పటికి గాంధీజీకి ఆశ కలిగింది. అందుచేత మరో

సారి ఇంటికి వెళ్తామని బయలు దేరారు. దోవలో లండన్‌లో ఉండగా 1914 సంవత్సరంలో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభ మైంది. యుద్ధం అనగానే గాంధీజీకి వెంటనే "రోగులకు సేవ" అని తడుతుంది. కనక ఇది వరకు బోయర్ యుద్ధంలో చేసినట్టు కొంతమంది స్వచ్ఛంద సేవకులను పోగుచేసి గాయపడిన సైనికులకు ఒక సంవత్సరం పాటు సేవ చేశారు. ఆ సేవను మెచ్చి బ్రిటిషు ప్రభుత్వంవారు ఆయనకు "కైసర్ హింద్" అను గొప్ప బంగారు పతకాన్ని బహూకరించారు.



గాంధీజీ బ్రిటిషు ప్రభుత్వంతో ఒక వంక పోరాడుతూ మరొక వంక సహకరిస్తూ ప్రజా ఉద్యమాన్ని ముందుకు తీసుక వెళ్ళారు. ఆయన తన వేష భాషలను సామాన్య గ్రామీణుని వేష భాష

లకు ఉచితంగా సంస్కరించు కున్నారు. అన్ని విధాలా ప్రజలలో కలిసిపోయి వారికి నాయకత్వం వహించారు.... తుదకు ఆహారాన్ని కూడా మార్చుకున్నారు. వైద్య విధానాన్ని కూడా మార్చుకుని పొదుపు చేశారు. ప్రతి విషయం లోనూ ఆచరణరంగంలో 'మహాత్ముడు' గా సంచరించి చూపారు.

## సబర్మతి ఆశ్రమం

ఇండియాకు తిరిగి వచ్చాక గుజరాతు ప్రాంతంలో సబర్మతి అను నది ఒడ్డున ఒక ఆశ్రమాన్ని స్థాపించి అచ్చట గాంధీజీ ఉంటూ వచ్చారు. ఈ ఆశ్రమంలో ఒక చిన్న పాఠశాల కూడా ఉండేది. అచ్చట విద్యార్థులు చదువుకునేవారు. కాని వారు మనలాంటి బడి చదువు కాక చేతి పనులు, అంటే బట్టలు నేయటం, నూలు వడక టం, వడ్రంగి పనీ, కమ్మరిపనీ మొదలగు బేసిక్ విద్యను నేర్చుకునే వారు. ఈ వృత్తి పనులతో పాటు చదువు కూడా వారు నేర్చేవారు.

ఈ బడి చదువులవల్ల అట్టే లాభం లేదనీ వృత్తి చదువుల వల్లనే దేశం బాగు పడుతుందనీ గాంధీజి అభిప్రాయం.

# స్వదేశీ

చరఖా అంటే రాట్నము. దీనిని గాంధీజీ ప్రచారం చేశారు. మన ప్రజలలో నూటికి తొంబది మందికి పైగా కట్ట గుడ్డ, తిన తిండే లేదని నీకు తెలుసుగదా? మన బీదతనం పోవాలంటే మనమంతా రోజూ ఒక గంట కనీసం నూలు వడకాలన్నారు గాంధీజీ. అలా చేస్తే మనకు కావలసిన గుడ్డలు మనం తయారు చేసుకోవచ్చునన్నమాట. దేశం అంతటా నూలు వడకటం ప్రారంభమయింది. గాంధీజీ కూడా రోజూ తన చరఖాపై నూలు వడికేవారు. ఇలా వడికిన నూలుతో నేసిన గుడ్డను "ఖద్దరు" అంటారు. గాంధీజీ ఖద్దరు ఉద్యమం కూడా బ్రిటిషు ప్రభుత్వాన్ని ఆర్థిక రంగంలో ఎదుర్కొను ఒక ఆయుధమే.

ఖద్దరు కట్టటం వల్ల మనకు చాలా లాభాలున్నాయి. మనం చేతితో తయారు చేసుకున్న నూలుతో నేసిన గుడ్డలను కట్టుకున్నామనే సంతోషం ఉంటుంది. మన దేశం నుండి కోటాను కోట్ల రూపాయలు గుడ్డలకై ఇతర దేశాలకు పోతున్నాయి. మనం దినదినం బీదవారమై పోతున్నాము. కనక "విదేశాల గుడ్డలను వాడకండి" అన్నారు గాంధీజీ. దేశమంతటా దేశభక్తి ఒక్కమారుగా వెల్లువికి వచ్చింది. విదేశపు బట్టలనే కాక ఏ ఇతర

మగుస్త్రిలనూ వాడటం మాని వేశారు. గాంధిజిని, మన దేశంలో ఉన్న విదేశ ప్రభుత్వానికి "పరమ శత్రువు" అని బ్రిటిష్ వారనుకున్నారు. కాని పాపం ఏంచేయగలరు? ఈ ఉద్యమానికి "స్వదేశీ" అని పేరు వచ్చింది.

## ఇండియాలో

మన దేశాన్ని ఇండియా అంటారని నీకు తెలుసు గదూ? అయితే ఈ మన దేశం నుండి బ్రిటిషు వారు వెళ్ళి పోవాలనీ, మనకు స్వతంత్ర్యం కావాలనీ మన ప్రజలు చాలా ప్రయత్నాలు చేస్తూండే వారు. కొందరు, బ్రిటిషు వారిని సైన్యబలంతో ఎదుర్కొని, యుద్ధంచేసి ఓడించి, పంపివేయాలనే వారు. మరి కొందరు, మనం సైన్యాలను పోషించుకోలేము కాబట్టి, బ్రిటిషు అధికారులపై బాంబులు వేసి, హత్యలు చేసి, బెదరించి వెళ్ళ గొట్టాలనే వారు. కాని గాంధీజీ ఏమన్నారో తెలుసా? "బ్రిటిషు వారు చేసిన శాసనాలను ఒప్పుకోకుండా ఎదిరించాలి. వారి వస్తువులను కొనకూడదూ వాడకూడదు. వారు జైళ్ళలోకి పంపితే పోవాలి. తుపాకులతో కాల్చి, లాఠీదెబ్బలు కొట్టినా పోరాటాన్ని ముందుకు సాగించాలి. అహింస ద్వారా హింసను ఓడించి చూపాలి. అప్పుడే మనకు స్వరాజ్యం వస్తుంది" అని. స్వరాజ్యం అంటే మన రాజ్యాన్ని మనమే పరిపాలించటం. స్వరాజ్యంలో మనం

స్వతంత్రులుగా ఉంటాం. అయితే గాంధీజీ పై చెప్పిన మాటల్ని విని మొదట చాలా మంది నవ్వుకున్నారు. ఈ ముసలాయనకు ఏదో పిచ్చిగాని స్వతంత్రం అలావస్తుందా? అది ఒకడిస్తే పుచ్చుకునేదా? అని రక రకాలుగా గాంధీజీని వెక్కిరించారు. కాని చివరకు గాంధీజీ చూపిన ఈ మార్గం వల్లనేకదూ మనకు స్వరాజ్యం వచ్చింది? అయితే మొదట గాంధీజీ చెప్పిందాన్ని ప్రజలు నమ్మక పోవటానికి కారణం ఉంది. బ్రిటిషు వారికి వారి గొప్ప సైన్యం, పోలీసులు ఉన్నారు కదా. అటువంటి శక్తివంతులను కేవలం వాళ్ళ శాసనాలను ఎదుర్కోవటంద్వారా ఎలా ప్రతిఘటించ గలం? అని. కాని భారతీయ ప్రజల దృఢ సంకల్పశక్తి ముందుకు సాగి ప్రజోద్యమాలు బలపడిన కొద్దీ ఈ భయాలన్నీ అంతరించాయి. సత్యాగ్రహ విధానం నెగ్గితీరింది,

అయితే ఇండియాలో మొట్టమొదటి సత్యాగ్రహం 6వ ఏప్రిల్ 1919న మొదలయింది. దేశమంతటా వర్తకులు దుకాణాలు మూసివేశారు. విద్యార్థులు బళ్ళకు పోవటం మానివేశారు. బ్రిటిషు ప్రభుత్వం హడలి పోయింది. గాంధీజీని వెంటనే అరెస్టు చేసి జైలులోకి త్రోసింది.

## జలియన్ వాలా తోట

జలియన్ వాలా బాగ్ (బాగ్-తోట) అనునది ఉత్తర హిందూస్థానంలో అమృతసర్ అను పట్టణంలోని

ఒక తోట. గాంధీజీ అరెస్టు వార్త వినగానే అమృత్‌సర్ ప్రజలు చాలామంది ఈ తోటలో ఒక సభ ఏర్పాటు చేసుకున్నారు. ఆ సభలో గాంధీజీ మరి ఇతర నాయకుల అరెస్టును గురించి వారు చర్చించుకొన దలచారు. అది ఏప్రిల్ మాసము 13 వ తారీకు 1919 వ సంవత్సరము. ఈ తోట చుట్టూ ఎత్తైన ప్రహరీగోడ లున్నాయి. ఒకవైపు నుంచి మాత్రమే వచ్చుటకూ, పోవుటకూ దారి. అదైనా ఇరుకు దారే!

అయితే పైన చెప్పిన సత్యాగ్రహం వల్ల బ్రిటిషు దొరలకు అదివరకే ఒళ్ళు మంట ఉందని తెలిసిందేగదా? ఆ కోపంతోనే ప్రజా నాయకులందరినీ అరెస్టు చేశారు. వారి అరెస్టులను గురించి మాట్లాడుకోవాలని ఆ సభ ఏర్పాటు చేసుకోవడమే ఆ ప్రజల నేరమట. ఆ నేరానికి ఆ తోట గుమ్మం ముందర పెద్ద పెద్ద మిషన్ మరతుపాకులు పెట్టి కాల్పులు సాగించారు. సభలో పెద్ద గందరగోళం బయలు దేరింది. బయటికి పోయేందుకైనా వేరే దారి లేదుకదా?

ఆ విధంగా ఆ రాక్షసులు, నిరాయుధులూ అహింసా పరులగు వందలాది దేశభక్తులను పిట్టలను పేల్చినట్లుగా పేల్చి వారు. ఆడవాళ్ళూ, మొగవాళ్ళూ, పిల్లలూ, విద్యార్థులూ మొత్తం రెండువందలకు పైగా నేలకొరిగి పోయారు.

ఈ ఉదంతం గాంధీజీకి తెలిసి ఆయనెంతో బాధ పడ్డారు. అప్పటికి సత్యాగ్రహం నిలుపు చేశారు....

## బార్డోలీ సత్యాగ్రహం- ఉక్కు మనిషి

1922 లో మళ్ళీ పెద్ద ఎత్తున సత్యాగ్రహం మొదలు పెట్టారు. అప్పుడు గాంధీజీకి బ్రిటిషు వారు ఆరేండ్ల ఖైదు శిక్ష వేశారు. గుజరాతు ప్రాంతంలోని "బార్డోలీ" అను చిన్న గ్రామంలో ఈ సత్యాగ్రహం ప్రారంభించ బడ్డది. ఈ సత్యాగ్రహాలజట్టు నాయకుడు సర్దార్ పటేల్. పటేల్ గారిని గురించి నీవు వినే ఉంటావు. ఆయన ఇప్పుడు గతించారు. బ్రతికి ఉన్నప్పుడు ఆయన మన దేశానికి చేసిన సేవ చాలా గొప్పది. ఆయనను మన దేశపు "ఉక్కు మనిషి" అనే వారు. ఆయన ఆ విధంగా దేశం కొరకు అహోరాత్రులు తన శరీరాన్నీ ఆరోగ్యాన్ని కూడా లెక్క చెయ్యక పని చేసేవారు.

అయితే ఈసారి గాంధీజీ జైలులో రెండేండ్లు గడపగానే రోగపీడితు లైనారు. అందుచేత ప్రభుత్వం వారిని విడిచి పెట్టింది.

## హిందూ ముస్లిం ఐక్యత

మన దేశంలో మతం పేరిట పోట్లాటలు జరుగు చుండేవి. ముఖ్యంగా హిందువులూ ముస్లింల మధ్య.

అదయినా బ్రిటిషు వారి "ద్విజాతి సూత్రం" మూలంగానే. అయితే గాంధీజీ ఈ హిందువులనూ ముస్లింలనూ ఏకం చెయ్యాలని 21 రోజులపాటు ఉపవాసం చేశారు. అప్పుడు హిందువులూ ముస్లింలూ అందరూ భయపడ్డారు మహాత్మని కేదైనా అపాయం కలుగుతుందేమోనని. ఇక ముందు పోట్లాటలు జరుగనీయమని హిందూ ముస్లిం నాయకులు గాంధీజీకి హామీ నిచ్చారు. ఆ విధంగా ఆయన ఉపవాసం అంత మయింది.

తమ వారు పెడదారి తొక్కుచున్నప్పుడు వారిని సరియైన దారిలో పెట్టుటకు "నిరాహార దీక్ష" ను మించిన గాంధేయ ఆయుధము మరొకటి లేదు.

## ఉప్పు సత్యాగ్రహం

అది 1930 వ సం॥ మార్చి నెల. ఆ నెలలోనే గాంధీజీ "ఉప్పు సత్యాగ్రహం" ప్రారంభించారు. ప్రభుత్వం అప్పట్లో ఉప్పుపై పన్ను వేస్తూ ఒక శాసనం చేసింది. ఆ శాసనం అన్యాయమనీ, అందుచేత దాన్ని ప్రజలు ఎదిరించాలని గాంధీజీ అభిప్రాయము. గాంధీజీకి అన్యాయమని తోచిన దాన్ని నిర్భయంగా ఎదిరించే అలవాటు ఉందని నీవు ఇదివరకు చదివావు కదా? అయితే ఈసారి "దండీ" అను సముద్రపు ఒడ్డుననున్న గ్రామానికి గాంధీజీ

శిష్యులతోపాటు వెళ్ళి ఉప్పు తయారు చేయదలచుకున్నారు. (ఈ సత్యాగ్రహం "దండీయాత్ర" అనే పేరుతో చరిత్ర ప్రసిద్ధ మైనది). దేశమంతటా ప్రజలు ఉప్పును తయారు చేయటం ప్రారంభించారు. ప్రభుత్వం ఈ పరిస్థితిని చూచి ఊర్కోలేక పోయింది. ఈ సారికూడా నాయకులం దరినీ పట్టి జైలులో తోశారు. అందు జవాహర్‌లాల్ నెహ్రూ కూడా ఒకరు. గాంధీజీ కాలినడక దండీ యాత్రలో, మార్గ మధ్యంలో, అర్ధరాత్రి అకస్మాత్తుగా అరెస్టు చెయ్యబడ్డారు. బ్రిటిషు ప్రభుత్వపు ఈ పిరికితనం గాంధీజీ నైతిక విజయానికి నిదర్శనమైనది.



## రౌండు టేబుల్ సభ

గాంధీజీ ఒకసారి ఢిల్లీ వెళ్ళి వైస్రాయి (బ్రిటిషు రాజ ప్రతినిధి)ని కలసికొని మాటాడారు. వైస్రాయి

బాపూజీని రౌండు టేబుల్ సభలో పాల్గొనుటకై ఇంగ్లం డుకు ఆహ్వానించారు. రౌండు టేబుల్ సభ అంటే ఇంగ్లండులో గుండ్రని బల్ల చుట్టూ కూర్చొని ప్రభుత్వ స్థాయిలో జరుపుకునే ఒక సభ. ఈ సభల ఆచారం ఇంగ్లండులో అనాది నుంచీ వస్తున్నది. గాంధీజీ దీని ద్వారా భారత దేశానికి స్వయం పరిపాలనాధికారం సాధించ వచ్చునేమోననే ఆశతో ఇంగ్లండు వెళ్ళారు. కాని ఫలితం లేకపోయింది.

ఇంగ్లండులో దిగగానే ఈయనను చూచిన వారం దరూ ఆశ్చర్య పోయారు. ఎందు చేతంటే గాంధీజీ ఇంగ్లండు వాసుల్లాగా సూటూ, బూటూ, కోటూ వేసుకోక ఒక్క చిన్న అంగ వస్త్రం మాత్రమే, అదయినా ముత కది, కట్టుకునే వారు. కాని చూశావా ఈ అంగ వస్త్రం పెట్టుకొని దరిద్ర నారాయణుడుగా ఉన్న బాపూజీయే ఓవ రకు గెలిచారు! ఆ సామాన్య ప్రజా ప్రతినిధి వేషం లోనే ఆయన సమావేశంలో పాల్గొన్నారు. అందుకే—

"కొల్లాయి గట్టితేనేమి
మా గాంధి మాలడై తిరిగితే నేమి?"

అని ఒక కవి వ్రాశాడు.

ఈ సంప్రతింపులు విఫలమై బాపూజీ ఇంగ్లండు

నుంచి వచ్చాక దేశంలో తిరిగి ఆందోళన చేయగా ఆయ నను అరెస్టు చేశారు. కాని ఒక మాసం రోజులకే తిరిగి విడుదల చేయవలసి వచ్చింది! ఇలా క్రిమ క్రిమంగా సూర్యాస్తమయం కన్నెరుగని బ్రిటిషు ప్రభుత్వం వెనుకంజ వేయసాగింది....!

## హ రి జ ను లు

గాంధీజీ హరిజనులను గురించి చాలా కృషిచేశారు. మన దేశంలో మాల మాదిగలు అనబడు వారున్నారు. వారిని మనం ముట్టుకొనే వాళ్ళం కాదు. వారిని మృగ ముల వలె నీచంగా భావించే వాళ్ళం. అయితే ఈ మాల మాదిగలకే గాంధీజీ "హరిజనులు" అని పేరు పెట్టారు. "హరి" అంటే భగవంతుడు, "జను" లంటే ప్రజలు— భగవంతుని ప్రజలు అన్నమాట. గాంధీజీ హరిజను లకు మన దేవాలయాల్లోకి ప్రవేశం కలిగించారు. అదీ కాక "హరిజన్" అను పత్రికను నడుపుతూ వారి అభివృ ద్ధికై పాటుపడ్డారు. ఆ పత్రిక ఇప్పటికీ నడుస్తూనే ఉన్నది.

కులతత్వాల నిర్మూలనకు గాంధీజీ చూపిన రాచ బాట ఈ హరిజనోద్యమమే.

# ప్రపంచ యుద్ధం

1939లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. వేలకువేల మనుషులను సునాయాసంగా చంపేసేందుకు మహాఘోరమైన మారణాయుధాలు కనుగొనబడ్డాయి. ఈ యుద్ధంలో బ్రిటన్ ఇండియాను కూడా ఇరికించాలని చూచింది. 'జర్మనీ దేశంతో ఇండియా కూడా యుద్ధం చేస్తుంది' అనే ప్రకటనను బ్రిటన్ చేసింది. కాని ఇండియా ప్రజలు బానిసలుగా ఉండి సామ్రాజ్య దేశాల కొరకు పోరాడమంటే ఎలా పోరాడుతారు? కనక మన నాయకులు మనకు స్వతంత్రం ఇచ్చేవరకూ మేం యుద్ధంలో చేరము అని ప్రభుత్వానికి తెల్పారు. యీసారికూడా నాయకు



లందరినీ జైలులో త్రోశారు. ఈసారి గాంధీజీ యుద్ధ సమయంలో బ్రిటిష్ ప్రభుత్వంతో అసహకారాన్ని అవలంబించి ప్రతిఘటించారు....

యుద్ధం సాగుతూనే ఉంది. అది 1941 వ సంవత్సరము. జపాన్ విమానాలు రయ్యిన వచ్చి మన దేశంపై బాంబులువేయడం మొదలెట్టాయి. అది చాలా అపాయకరమైన సమయం అని నాయకులందరూ గ్రహించి బ్రిటిష్ వారిని "మా దేశం విడిచి వెళ్ళండి" (Quit India) అని గర్జించారు. "బ్రిటిషువారిని దేశం నుండి వెళ్ళకొట్టండి లేదా చావనన్నా చావండి" (Do or Die) అని ప్రజలను గాంధీజీ ఆదేశించారు. దేశమంతటా "మా దేశం విడిచి



పోండి" అనేనినాదం ఆకాశా న్నంటింది. ఆగస్టు 9వతేది నాటి రాత్రి అందరు నాయకు ల్నీ అరెస్టు చేసి రహస్యంగా ఉంచారు. లక్షలాది ప్రజలు ఉద్యమంలో ధైర్యంగా జొర బడ్డారు. బ్రిటిషువారి జైళ్ళన్నీ నిండి పోయాయి. స్త్రీలు, పిల్లలు కూడా ఉద్యమంలో చేరి పోరాటం సాగించారు. ప్రభుత్వ పోలీసు ఠానాలు తగుల బెట్టారు. తెల్లవాళ్ళను





చంపారు. రైలు పట్టాలు పీకి వేశారు. తంతి తీగెలు తెగ కొట్టారు. చివరకు ప్రభుత్వమే నడవ కుండా చేశారు తెల్లదొరల ప్రభుత్వం గడ గడ లాడింది. ప్రజలపై నానా అత్యాచారాలు సాగించింది. అయినా ప్రజలు లొంగ లేదు.

దేశ వ్యాప్తంగా హింసావృష్టిని కురిపించిన ఈ ప్రజా విప్లవాన్ని అదుపులోకి తేవటం గాంధీజీ అతి కష్టం మీద సాధించ గలిగారు.

★ ★ ★ ★

గాంధీజీ ఆగాఖాన్ మందిరంలో చెరబెట్ట బడ్డారు. వెంట కస్తూరిబా కూడా ఉంది. దేశ శాంతికై గాంధీజీ 21 రోజుల ఉపవాసం ప్రారంభించారు. ఉపవాసం రోజులు గడుస్తూన్న కొద్దీ ప్రజల మనస్సులు గాంధీజీ ఆరోగ్య క్షేమాల వైపు మరల సాగాయి. ఫలితంగా హింసా దమననీతి ఉపశమిల్లినది. ప్రభుత్వం కూడా గాంధీజీకి అపాయం కలిగితే అంతతే కోపోద్రిక్తులైన ఈ ప్రజల్ని పట్టుకోవటం అసాధ్యమని గ్రహించి అనేక మంది అనుభవజ్ఞులగు డాక్టర్లను గాంధీజీ వద్ద ఉంచింది. ఉపవాసం విడవకపోతే గాంధీజీప్రాణాలకు బాధ్యతవహించ లేమని ప్రభుత్వం ప్రకటించింది. అయినా గాంధీజీ ఉప వాసం మానలేదు. చివరకు ఉపవాసం విజయవంతంగా ముగిసింది. గాంధీజీ తిరిగి కోలుకుంటున్నారు.



ఆగాఖాన్ మందిరం కేవలం పేరుకు మాత్రమే పెద్ద భవనం. నిజానికి దాని స్థితి అంత బాగుండేది కాదు. ఆ ఇంటిలో తోటలకు బదులు ముండ్ల పొదలు, మంచి వెల్తురూ గాలీ ఇచ్చే గదులకు బదులు గబ్బిలాలు తిరిగే చీకటికొట్లూ ఉండేవట. ఆ దుర్భరమైన వసతిలో గాంధీజీ ఉపవాసదీక్ష రోజులు గడిచాయి. ఆ రోజులన్నీ కస్తూరిబా రాత్రనకా పగలనకా ఆయనకి సేవచేస్తూ గడిపింది. ఆమె చాలా అలసిపోయి జబ్బు పడ్డది. ఆమెకి తిరిగి గాంధీజీ సేవచేయ వలసి వచ్చింది. కాని చివరకామె మరణించింది. ఆనాడు గాంధీజీ ఏకాంతంగా ఆ దుఃఖాన్ని అనుభవించాల్సి వచ్చింది. స్వాతంత్రోద్యమంలో గాంధీజీకి తోడుగా పనిచేసిన వీరవనిత కస్తూరిబా మరణవార్త విని దేశవాసులంతా దుఃఖించారు.

# హత్యాకాండ

కస్తూరిబా స్వర్గస్తురాలైన కొన్నాళ్ళకు గాంధీజీ తిరిగి జబ్బు పడ్డారు. ప్రభుత్వం వారిని విడిచి పెట్టింది. ఒక సంవత్సరం తర్వాత బంధింపబడిన ఇతర నాయకులూ ప్రజలూ కూడా విడిచి పెట్ట బడ్డారు.

అప్పుడు వైస్రాయి భారత నాయకులందరనూ ఒక సభకు ఆహ్వానించారు. ఆ సభలో భారత దేశానికి స్వాతంత్ర్యం ఎటువంటిది, ఏ విధంగా ఇవ్వాలో నిర్ణయించబడవలసి యుండెను. కాని అంత పెద్ద విషయం ఆ సమావేశంలో తేలిపోతుందా? కనక ఆ సభ విఫలమైందనే చెప్పాలి. ఒక సంవత్సరం వరకూ ఇలాగే సంభాషణలు జరుగుతూ వచ్చినవి. ఇక్కడొక చిన్న విషయం చెప్పాలి. ఏమంటే, మన దేశంలో "ముస్లింలీగు" అను ఒక సంస్థ ఉన్నది. అది ముస్లింల మతసంస్థ. కాంగ్రెస్ వలె రాజకీయ సంస్థ కాదు.

ఈ ముస్లిం మత సంస్థకు బ్రిటిషు పరిపాలకుల అండ దండలు మొదటినుంచీ ఉంటూ వచ్చినవి. వారి సలహాల ప్రకారమే ఈ లీగు నాయకుడు మహమ్మదాలీ జిన్నా ఈ సంస్థకు రాజకీయ ముసుగు తొడిగాడు. ఆయన ఇండియాను విభజించమని పట్టు బట్టాడు. ఒక

భాగంలో హిందువులూ మరొక భాగంలో ముస్లింలూ విడి విడిగా ఉంటేనే బాగుంటుందని ఆయన వాదం. ముస్లి ముల భాగానికి ఆయన "పాకిస్తాన్" అని పేరు పెట్టాడు. దేశాన్ని రెండుగా చీల్చటానికి కాంగ్రెసుగానీ గాంధీజీగాని ఒప్పుకోలేదు. ఈ సందర్భంలో గాంధీజీ ఈ విధంగా బ్రిటిషు వారికీ మస్లిము నాయకులకూ హెచ్చరిక చేశారు—

"హిందువులూ, ముసల్మానులూ ఇతరులూ అన్ని చోట్లా కలిసి ఉండే బీద దేశం 'ఇండియా'. అటువంటి ఇండియాను రెండు ముక్కలు చెయ్యటం 'అరాచకత్వం' కంటే హీనం. ఆ విభజన సహించరానిది. నేను హిందువు ననికాదు ఎందుచేతంటే నేను హిందువులూ ముస్లిములూ పార్సీలూ ఇతరులు అందరి తరఫునా మాట్లాడు తున్నాను. "ముందు నన్ను చంపి ఆ తర్వాత ఇండియాను ముక్కలు చెయ్యండి" అంటాను. రెండు శతాబ్దాలకు పైగా దేశాన్ని ఏలిన మొగలులు చెయ్యలేని పని మీరు చెయ్యలేరు."

అయితే జిన్నా మాత్రం ఊరుకోలేదు. ముస్లిం గూండాలను హిందువుల పైకి ఉసిగొల్పి "ప్రత్యక్ష చర్య" అని ఆ గుండాతనానికి పేరు పెట్టాడు. దాంతో తురక లకూ హిందువులకూ ఘోరమైన పోట్లాట ప్రారంభమైంది. వేనకువేలు జనులు తెగి కుప్పలు తిప్పలుగా పడిపోయారు.

ఈ భయంకర హత్యాకాండ గాంధీజీని చాలా దుఃఖితుని జేసింది. ఆయన స్వయంగా ఈ హత్యాకాండ జరిగే చోటికి వెళ్ళి ఆ ప్రజల్ని చూస్తానని బయల్దేరారు. నవఖాలీ అను చోట ఆయన కాలినడకన తిరిగారు. ప్రతి ముస్లిం ఇంట్లో ఆయన బసచేశారు. భగవద్గీత చదివారు. కురాన్ చదివారు. ఈ రెండూ అందరి చేతా చదివించారు. ఆ నవఖాలీ శ్మశానంలో అడుగడుక్కీ పుర్రెలూ, ఎముకలూ బాపూజీకి ఎదురయ్యేవి. అలాంటి ప్రమాదకరమైన చోట గాంధీజీకి ఏదైన ప్రమాదం జరుగుతుందేమోనని ఆయన శిష్యులు కూడా వెంట వెళ్ళారు. చివరకు బాపూజీ నవఖాలీలో పూర్తి శాంతిని నెలకొల్ప గలిగారు.



# 15 వ ఆగస్టు 1947

ఇలా ఉండగా 15 వ ఆగస్టు 1947 వ సంవత్సరం వచ్చింది. మన భారతదేశం స్వతంత్రమైంది. మనం దాదాపు రెండు వందల సంవత్సరాలు బానిసలుగా గడిపిన జీవితం ఆనాటితో ఆఖరయింది. ఆనాటి సూర్యుడు ఒక కొత్త తేజస్సుతో వెలిగాడు. ఆనాటి చంద్రుడు నవ్వుతూ నవ్వుతూ వెన్నెలలు విరబోసాడు. ఆనాటి తారకల మిల మిలలలో కోటానుకోట్ల భారతీయుల హృదయ సంతోషం ప్రపంచానికి కనబడింది.

ఈ విధంగా దేశం స్వతంత్రమైంది.
కాని రెండుముక్కలు కూడా అయిపోయింది.
పాకిస్థాన్ ఏర్పడింది.

## గాంధీజీ "భారతదేశం"

స్వతంత్రం వచ్చిన వెంటనే దేశ నిర్మాణాన్ని గురించి గాంధీజీ వివిధ నాయకులతో చర్చించారు. మన దేశాన్ని సత్యం అహింసల మీద రూపొందే రామరాజ్యంగా నిర్మించాలని తలపోశారు. ఆర్థిక అసమానతలను రూపుమాపి ఒకరినొకరు పీడించుకు తినే అవకాశాలులేని సాంఘిక వ్యవస్థను రూపొందించాలని అభిలషించారు. ఆయన

నిర్మించ దలచిన భారతదేశ స్వరూపం ఆయన మాటల్లో ఇలా ఉంటుంది—

"ఏ భారత దేశంలో దరిద్రతమ ప్రజలు సహితం ఈ దేశం తమదనీ, ఈ దేశంలో క్రియాశీలమైన, మహత్తర మైన సత్తాగలదనీ, మానవుల వలె జీవించటానికి శాశ్వత గౌరవమూ అధికారమూ కలదనీ తలచగలరో అట్టి భారత దేశము నిర్మించ కోరుచున్నాను.

"నా భారత దేశంలో ఉచ్ఛ నీచమైన శ్రేణులకు తావులేదు. సకల మతాల వాళ్లూ అన్నదమ్ముల వలె కలిసి మెలిసి ఉండగలరు. నాభారత దేశంలో అంట రాని తనం రూపుమాసి పోతుంది. మద్యపానం అదృశ్య మౌతుంది. స్త్రీలు పురుషులతో సమానంగా అధికారం కలిగి ఉంటారు.

"మనం ప్రపంచ ప్రజలతో శాంతియుతంగా నడుచుకుంటాం. శత్రువుల యెడల కూడా కోపం వహించక ప్రశాంత మనస్సుతో వ్యవహరిస్తాం. మనం ఒకళ్ళని పీడించం. మనం పీడితులంకాం. మన సైన్యం సాధ్యమైనంత తక్కువగా ఉంచబడుతుంది...."

# మతోన్మాదుల విచ్ఛిన్న చర్యలు

స్వతంత్రం వచ్చి పాకిస్తాన్ ఏర్పడగానే పాకిస్తాన్ ముస్లింలది మాత్రమే అన్న మూఢ ప్రచారం ఆ ప్రాంతంలో కొనసాగింప బడ్డది. ఆకారణంగా అక్కడున్న హిందువుల మాన ప్రాణాలకు, ఆస్తిపాస్తులకు భద్రత లేకుండా పోయింది. లక్షలాది జనం ప్రాణాలను అరచేతుల్లో పెట్టుకుని కట్టు బట్టలతో ఇండియా వచ్చేశారు.

పాకిస్తాన్ నాయకులు అవలంబించిన ఈ విధానాల ప్రభావం ఇండియా ప్రజల మీద పడకుండా ఉండలేక పోయింది. గాంధీజీ ఉద్బోధనలను కూడా వినిపించుకోనంతటి ఉద్రిక్త పరిస్థితులకు దారితీసింది. ఇండియాలో కూడా మతోన్మాదులు రెచ్చిపోయారు. పాకిస్తాన్ ఇండియాలు రెండూ పోటీ పడి హత్యాకాండకు పూనుకున్నాయి.

గాంధీజీ తిరిగి ఉపవాస వ్రతం ప్రారంభించారు. ఈ అల్లర్లు ఆగనన్నా ఆగాలి లేకపోతే తను జీవితం చాలించనన్నా చాలించాలి అని గట్టి పట్టు పట్టారు.

ఇండియాలోని హిందూ ముస్లిం నాయకులందరూ ఏకమయ్యారు. ఎట్టి పరిస్థితుల లోనూ అల్లర్లు జరుగనియ్యమని గాంధీజీకి హామీ నిచ్చారు. వీరి హామీల

మీద గాంధీజీ ఉపవాస దీక్ష విరమించారు. తన జీవిత శేషం హిందూ ముస్లింల సఖ్యత కోసం వినియోగించాలని నిర్ణయించు కున్నారు. గుళ్లూ, గోపురాలూ, మసీదులూ అన్నీ తిరుగ జొచ్చారు. ప్రతిచోటా, అన్ని మతాల వారి చేతా ప్రార్థనలు చేయించే వారు.

"ఈశ్వర్ అల్లా తేరేనామ్
సబ్‌కో సమ్మతి దే భగవాన్"

## గాంధీజీ హత్యా ప్రయత్నము

ఈ విధంగా గాంధీజీ ప్రార్థనలూ ఉపవాసాలు చేస్తూ మన దేశీయులను శాంతపరచి మత సామరస్యానికి ప్రయత్నం చేస్తూండగా అటు పాకిస్తాన్‌లో హిందువుల ఇళ్ళు దోపిడీ సాగించటం, లూటీలు చెయ్యటం, స్త్రీలను అపహరించుకు పోవటం మొదలగు ఘోర చర్యలు విచ్చల విడిగా సాగుతునే ఉన్నాయి.... ఆ ప్రభావం మన దేశంలోని హిందూ యువకుల్లో పడకపోలేదు. అందు చేత ఒకనాటి ప్రార్థన సమావేశంలో గాంధీజీని హత్య చేయుటకై ఒక యువకుడు బాంబు విసిరాడు. కాని అది తప్పిపోయినది. దానిపై గాంధీజీ ఆనాటి ప్రార్థన సమా వేశంలో—

"నేను వీరోచిత మరణం పొందుతానని నా జాతకంలో వ్రాసి ఉంది. పిస్తోలు గుండ్లతో గాని మరే విధం

గానో గాని నాకు మరణం ప్రాప్తిస్తుంది. ఈ శరీర ప్రతి బంధకమే లేకపోతే నేను మీకు మరింత దగ్గరగా ఉండగలను. నా దేశీయుడైన సోదరుని చేతిలో చావటం కంటే అదృష్ట మేముంది? అయినా గాంధీ చచ్చిపోయినా గాంధీ తత్వం మాత్రం చిరకాలం వర్ధిల్లుతుంది" అన్నారు. పైగా పట్టుబడిన ఆ యువకుణ్ణి విడిచి పెట్ట వలసినదని పోలీసులకు తెలిపారు. చూచావా గాంధీజీ ఎంతటి క్షమా మూర్తియో! ఆనాటి నుంచీ ప్రభుత్వం గాంధీజీ రక్షణకై పోలీసులను నియమించింది. కాని గాంధీజీ ఒప్పుకోలేదు తన రక్షణకై పోలీసులు అవసరం లేదన్నారు.

## 30 వ, జనవరి 1948

1948 వ సం॥ జనవరి మాసంలోని 30 వ రోజు వచ్చింది. ఆనాడు భారతీయులు ప్రతి దినమూ లేచినట్లే పడక లేచి కాలకృత్యాలు తీర్చుకొని తమ తమ పనుల్లోకి పోయారు. గాంధీజీ కూడా ఆ రోజు అన్ని రోజుల్లాగానే ఢిల్లీలోని బిర్లా మందిరంలోని తన ప్రార్థన సమావేశానికి చకాచకా నడిచి వచ్చారు. ప్రార్థనా వేదికపైకి ఎక్కి నిలిచి అందరికీ నమస్కరించారు.

"ఏం, బాపూజీ ఇవ్వాళ్ళ ఆలస్యమయిందేమిటి?" అని ప్రశ్నిస్తూ ఆయన కాళ్ళవరకూ వంగి ఒక దుర్మార్గుడు



వినాయక్ గోడ్సే అనువాడు, పిస్తోలుతో గాంధీజీ కడుపులో కాల్చాడు.

"హే రామ్" అంటూ గాంధీజీ నేల కొరిగారు. ఈ విధంగా గాంధీజీ జీవ యాత్రి వీరోచితంగా ముగిసి పోయింది.

ఇంతటితో మన కథ ముగిసి పోయినట్టే—

మనకిక ఆయన అదరింపులూ బెదరింపులూ విన రావు. ఆ బోసినోటి మధురమైన నవ్వు మనకిక కనిపిం చదు. చేతి కర్రితో చక చకా నడిచిపోయే ఆ బక్కపలు చని ముసలి శరీరాన్ని మనమిక చూడలేము. అది మన దురదృష్టమే.

ప్రపంచమంతా ఈ దుర్వార్త వెంటనే పాకిపోయింది. అన్ని దేశాలూ తమ తమ దేశీయ పతాకాల సగం వరకూ దించి ఆ మహామానవుణ్ణి గౌరవించాయి.

## అంత్యక్రియలు

గాంధీజీ అంత్యక్రియలు మరునాడు జరుపబడ్డాయి. లక్షలాది ప్రజలు ఆ "జాతీయ మహాఋషి"ని ఆఖరు సారిగా దర్శనం చేసుకొనుటకై ఢిల్లీకి చేరారు. దేశ దేశాల నుండి ఆయన అనుచరులూ స్నేహితులూ రెక్కలు కట్టుక వచ్చి వాలారు.

ఢిల్లీలో బిర్లా మందిరం నుండి పవిత్ర యమునా నది ఒడ్డున ఉన్న "రాజఘాట్" వరకూ వేసినపువ్వులు రాలనంత జనం కిటకిటలాడి పోయారు. బ్రహ్మాండమైన ఊరేగింపు తదనంతరం అంత్యక్రియలు చేయబడ్డాయి.

ఆ మహాఋషి తాలూకు "పవిత్ర చితాభస్మం" దేశంలోని అన్ని నదులలోనూ కలపబడింది. ఇక మనకు జాతీయ సంపదగా మిగిలిందల్లా ఆయన వాడిన భగవద్గీత, ఖురాన్, బైబుల్ — కలాలూ, కళ్ళజోడు, పావుకోళ్ళు చెప్పులు, గడియారం- పళ్ళరసం త్రాగే గిన్నెలు, మూడు బొమ్మలు; ఒకటి చెడు వినవద్దంటుంది, మరొకటి చెడు చూడవద్దంటుంది, ఇంకొకటి చెడు మాటాడ వద్దంటుంది. వీటిని మన జాతీయ ప్రదర్శనశాలలో భద్రపరచారు —




గాంధీజీ హత్యా వార్త విని దుఃఖించిన వారిలో కొందరు ప్రపంచ ప్రఖ్యాత వ్యక్తులు—

గాంధీజీ భౌతిక శరీరం మనమధ్య ఇక లేదు. స్పృశించుటకు ఆయన పాదాలు లేవు. మన భుజాలను తట్టి, మనను ఆశీర్వదించుటకై ఆయన చేతులు లేవు. మనని సత్యపథానికి త్రిప్పు ఆయన తీయని మాటలు విన రావు. ఎప్పుడూ ప్రేమ మాధుర్యాన్ని విరజిమ్మే ఆయన కళ్ళు మనపై ఇక ప్రేమ మధువును వర్షించ లేవు. కాని ఆయన చెప్పినట్లుగా శరీరం నశిస్తుంది - ఆత్మ నశించదు.

—అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్.

మిత్రులారా, మన జీవితాల్లో నుండి "వెలుగు" వెళ్ళిపోయింది. చుట్టూ చిమ్మచీకటి. కమ్ముకొంది. నేనేం చెప్పాలో ఏం మాట్లాడాలో నాకు తోచటం లేదు.

—ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ.

ఈ ఆపద సమయంలో మనం ఎవరమూ నిరాశా హతులం కాలేం. మన ఈ జాతీయ విపత్తును మనందరమూ ఏకమవటం ద్వారా ఎదుర్కొందాము.

—ఉపప్రధాని సర్దార్ పటేల్.

గాంధీజీ ఓటమి అంటే ఏమిటో ఎరుగరు. ముందు ఎవరూ త్రొక్కి ఎరుగని మార్గంగుండా నడుచుటకే ఆయన ప్రజల నుత్తేజ పరచే వారు....

—డి. జి. టెండూల్కర్.

భారత దేశం బ్రితకాలంటే, అభివృద్ధి చెందాలంటే గాంధీజీచే ఆశీర్వదింప బడిన సత్యాహింసల మార్గమునే అది అనుసరించ వలసి యుండును.

—చక్రవర్తుల రాజగోపాలాచారి.

రక్త మాంసాలలో ఇటువంటి "మహాద్భుత మనిషి" ఈ భూమిపై తిరిగాడంటే వచ్చే అనేక తరాలు బహుశా నమ్మలేక పోవచ్చు.... —ఆల్బర్ట్ ఐన్‌స్టీన్.